శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# సీతారామ శతకము

గ్రంథకర్త

వరుమూరి సీతారామాచా[illegible]

— చినకొండ్రుపాడు





1936

[ వెల 0-2-0.

శ్రీరామ

# సీతారామ శతకము

గ్రంథకర్త

పరుమాంచి సీతారామాచార్యులు,

చినకోండ్రుపాడు



మొదటికూర్పు 500 ప్రతులు.

చంద్రికాప్రెస్ - గుంటూరు

1936



[ వెల 0-2-0.

ఈశతకరాజమండలి పద్యములు కీర్తనలు నాసమ్మతిలేనిది అన్యులు యేపాత్తములందును ముద్రించకూడదు. అట్లు ముద్రించిన యెడల నేను జరిగించు చర్యలకు బద్ధులై యుందురు.

ఇట్లు.

పి. సీతారామాచార్యులు.

శ్రీరామ

# విజ్ఞప్తి

---

పరమభాగవత బృందంబుల కెల్లరకు సాష్టాంగవందన శతసహస్రంబు లొనర్చి విన్నవించు కొనుచున్న చిన్నమనవి.

భగవదవతారాది భక్తి జ్ఞానవైరాగ్యాది యుక్తంబును, కందచంపకోత్పలాది వృత్తసంయుతంబులై మృదుమధురగాంభీర్యాది సుశబ్దజాలశోభితంబులై, నొప్పారు శతకరాజంబు లమేయంబులుగను, భక్తజనహృదయోల్లాసంబుగను, సత్కవీంద్రోత్తములు, విరచించియున్నను, ప్రతిమనుజుండును, సర్వకాల సర్వావస్థలయందును, సర్వేశ్వరుని ధ్యానించుటయే సర్వోత్తమంబని పెక్కుపురాణాదులు దెల్పుచున్న వను నుడు లాలించుచును, భగవత్కైంకర్యాదులందత్యంతప్రీతిగల శ్రీమత్పెరుమాళ్ళ సీతారామాచార్యుల గారివలన కించి ద్జ్ఞానంబుచే రచించబడిన శ్రీసీతారామ శతకము భక్తియుక్తమై విరాజిల్లుచున్నదని నాయభిప్రాయము.

ఈశతకంబును తిలకించిన జ్ఞానవృద్ధులు యిందలి నెరసులను క్షీరనీరంబులభేదించు, మరాళంబురీతిని సవరించి వీరికి మనసోత్సాహం బభివృద్ధిజేయుదురుగాతయని ప్రార్థించుచున్నాను.

క. సీతారామాచార్యులు
సీతాపతిశతకమెల్ల చెల్వుగఁజెప్పఁ
బ్రీతిఁ జూచి పఠించితి
సీతాపతినామ మధుర సింధు వనదగుఁ. 1

క. సీతారామాచార్యని
భూతేశుని గొల్చుభక్తి పూర్ణులు మది సం
ప్రీతిఁ బొగ్తురుగావుత
సీతాపతి భక్తులకును చేమోడ్పెడుదుఁ. 2

క. సీతాపతిపూజాదుల
నాతతమును జేయు వీరి కతిశయభక్తిఁ
ఖ్యాతియు నాయువు సిరులిడి
సీతేశుడు బ్రోచుగాత చిరతర కృపతోఁ. 3

శ్రీ యువ సం॥
మాఘ శు ౧౦
ఆదివారము
2 2 1936

ఇట్లు విన్నవించుకొను పరమభాగవత విధేయుడు,
బలభద్రపాత్రుని వెంకటసుబ్బయ్య,
గుంటూరుతాలూకా చినకొండ్రుపాటినివాసుడు,
సదరుగ్రామబోర్డుస్కూలు ద్వితీయోపాధ్యాయుడు.

శ్రీసీతారాముల వారిసహాయము.

# అ భి ప్రా య ము.



అయ్యా !

చిన్నకోండ్రుపాటి కాపురస్థుడు పరుచూరి సీతారామాచార్యులువారు రచియించిన కందపద్యావళి శతకరాజమును నేను స్వయముగా సాంతముగా చూచినాను. అందులోని ప్రభావము క్షీరంబున కల్పిన శర్కరరీతి ఆపద్యావళిచవి అమృతతుల్యమై కర్ణానందమై నొప్పుచున్నది. దీనిని పఠించినవారికి విష్ణులోకనివాససిద్ధి గలుగును.

కంబెపూడి
సత్తెనపల్లితాలూకా
19-2-1936



ఇట్లు భగవద్విధేయుడు,
కొర్రపాటి వెంకటసుబ్రహ్మణ్యం.



శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# సీతారామ శతకము




సీతాపతి నీకృప
చే సీతారామయనెడు చెల్వగు శతకం
బాసతో దెల్పితి గొను మిది
శ్రీసతినుత కొండ్రపాటి సీతారామా. 1

క. శ్రీకమలోదర రామా
కాకోదరతల్పరామ కలుషవిరామా
పాకారివినుతరామా
శ్రీకరచినకొండ్రపాటి సీతారామా. 2

క. క్షీరాబ్ధిని గల్గిన సుధ
నారీమణివగుచు సుధను నసురుల కిడక౯
కూరిమితో సురల కొసగిన
శ్రీరమణా కొండ్రపాటి సీతారామా. 3

క. కరి ప్రహ్లాదుల గాచిన
నరహరి నిను నమ్మియుంటి నారదవరదా
కరుణతో గావుము దేవా
సిరిగల్గిన కొండ్రపాటి సీతారామా. 4

క. పరమదయాబ్ధీ మురహర
స్థిరముగ నీ సేవఁజేతు జిరతరభక్తిన్
కరుణతో గావుము దేవా
సిరివర శ్రీకోండ్రుపాటి సీతారామా. 5

క. దురమున దనుజుల కరములు
శిరములు ఖండించినట్టి శ్రీకరరామా
చరణంబుల దరిఁజేర్చుము
సిరిపతి చినకోండ్రుపాటి సీతారామా. 6

క. క్రూరుఁడు దుశ్శ్యాసనుఁ డా
నారీమణి వలువ లొలువ నతిఁజేయ నినున్
చీర లొసంగిన దేవా
శ్రీరమనుత కోండ్రుపాటి సీతారామా. 7

క. పురహరవందితచరణా
శరణాగతరక్షణుండ జగదభిరమణా
మొర విని వరము లొసంగుము
సిరి గూడిన కోండ్రుపాటి సీతారామా. 8

క. మారుతివాహన రామా
మారజనక కైటభారి మర్దన భీమా
శ్రీరామ రామ రామా
సిరి కిరవగు కోండ్రుపాటి సీతారామా. 9

క. పరమేష్ఠిని రక్షించిన
భరతాగ్రజ నన్ను గావ భారం బగునా

పురహరవందిత బ్రోవుము
సిరినిండిన కోండ్రుపాటి సీతారామా. 10

క. శిరమున రతనపు మకుటము
యురమున లక్ష్మిని ధరించి యుండెడి రూపుఁ
దరిశించెన దయ జూపుము
సిరి తరుచగు కోండ్రుపాటి సీతారామా. 11

క. హరి నీవే సతమని మది
మరిమరి నిను వేడుచున్న మనవిని విని, యో
కరుణాకర కాపాడుము
సిరిమించిన కోండ్రుపాటి సీతారామా. 12

క. శ్రీరామ రామ రామా
క్షీరాంబుధిశయన రామ శివకర రామా
కారుణ్యాంబుధి సోమా
శ్రీరమయుత కోండ్రుపాటి సీతారామా. 13

క. పరమాత్మా పరమేశా
దురితంబులు దోలుమయ్య దూషణ హారణా
సిరుడవు శుభకరచరణా
సిరినిలయా కోండ్రుపాటి సీతారామా. 14

క. జగదుద్ధారక దేవా
నగరాజసమానధీర నాళీకాక్షా
ఖగరాజవరద కడు వా
సిగ నుండిన కోండ్రుపాటి సీతారామా. 15

క. విజితేంద్రియ పాటించెద
త్రిజగంబుల నీనుకీర్తి త్రిదశేంద్రనుతా
భుజగేంద్రశయన శ్రీ సర
సిజనేత్రా కొండ్రుపాటి సీతారామా. 16

క. రామా నీ సరిదైవము
భూమండలమందు వెదుక పూజ్యం బయ్యెన్
సోమార్కనయన కుండన
సీమాచినకొండ్రుపాటి సీతారామా. 17

క. కొంచెపు సుఖదుఃఖములకె
మించుచు తగ్గుచును నుంటి మీ మహిమాదుల్
నెంచెదు బుద్ధిని [illegible]
చించకు చినకొండ్రుపాటి సీతారామా. 18

క. సంజాతరహిత విను మీ
కంజలి యొనరింతు రామ నార్తశరణ్యా
నెంజిలులను మాన్పుట మో
చించుము చినకొండ్రుపాటి సీతారామా. 19

క. నీరజలోచన భవ సం
సారాబ్ధిని గూలనీక సాకుము తండ్రీ
శ్రీరఘువంశోత్తమ ల
క్ష్మీరమణా కొండ్రుపాటి సీతారామా. 20

క. కరచరణా ద్యష్టాంగము
లిరవొందగ సాచి మ్రొక్కిడితిని రామా

దర ముంచియు దరి జేర్పుము
చిరత రకృప కొండుపాటి సీతారామా. 21

క. మీ చరితము లతిశయములు
మీ చరితము దెలుపవశమ మిత్రకులేశా
మీ చరితమె వరసీయము
శ్రీచరణా కొండుపాటి సీతారామా. 22

క. స్నానోదక వసతులు మరి
నానార్థము లొసగి బోత్రు వఖిలజగములన్
జానకిపతి శ్రితరక్షక
శ్రీనుతపద కొండుపాటి సీతారామా. 23

క. ఆదిమ యంత రహితుడవు
పాదము వసనములు వస్తుసమితి నొసంగే
నీ దయ యెంతని పొగడుదు
శ్రీదయితా కొండుపాటి సీతారామా. 24

క. తల్లియు దండ్రియు బాంధవు
లెల్లసఖులు గురువు దాత లెల్లరు నీవే
ముల్లోక రక్షకుడ విల
సిల్లెడు చినకొండుపాటి సీతారామా. 25

క. దిక్కవే రఘురామా
దిక్కవే సుగుణధామ దేవలలామా
మొక్కెతి నీపదములు చే
జిక్కను విడ కొండుపాటి సీతారామా. 26

క. కుండలిశయన త్రివిక్రమ
చండాంశుసమాన తేజ చక్రపాణి కో
దండధరా దనుజాళుల
చెండిన చినకోండ్రుపాటి సీతారామా. 27

క. కేశవ నారాయణ హృషి
కేశా శ్రీపద్మనాభ కేలోన్మత్తు హారీ
నాశరహిత మధుసూదన
శ్రీశా చినకోండ్రుపాటి సీతారామా. 28

క. దామోదర సంకర్షణ
శ్యామాంగా వాసుదేవ శాంతస్వరూపా
ధీమహితుడ నరసింహా
శ్రీమంతుడ కోండ్రుపాటి సీతారామా. 29

క. వామన శ్రీధర ధోక్షజ
సామజవరదా నిరుద్ధ సద్గుణస్తోమా
కామాదివిజిత రామా
శ్రీమంతుడ కోండ్రుపాటి సీతారామా. 30

క. విష్ణచ్యుత పురుషోత్తమ
కృష్ణా గోవింద శౌరి కృపజూడుమయా
తృష్ణాదుల దోలుము రో
చిష్ణా చినకోండ్రుపాటి సీతారామా. 31

క. అనిరుద్ధుడ వోమాధవ
వినతాసుతవాహా శ్రీత్రివిక్ర ముపేంద్రా

వనజాక్షా ప్రద్యుమ్నా
చినకోండ్రపురీనివాస సీతారామా. 32

క. దినకరకులతిలక జనా
ర్దన మునిజనపోష రామ దైవలలామా
జనకుని ప్రియసుత నాథా
చినకోండ్రపురీనివాస సీతారామా. 33

క. మేచకవర్ణ శరీరా
నీ చతురిమ దెలుపవశమ నేరుపులెల్లన్
వాచస్పతి విధి వెల్వేదు
శ్రీచరణా కోండ్రపాటి సీతారామా. 34

క. తండోపతండములు భవ
తండంబులలోన జిక్కి తార్మారగు నన్
దండ నేజిచి యఘముల
చెండుము చినకోండ్రపాటి సీతారామా. 35

క. వింతలు వింతలుగా మది
చింతోత్సాహములుజేరి సిలుగులు బెట్టన్
చెంతన్ రానీకని నిను
చింతించితి కోండ్రపాటి సీతారామా. 36

క. పరు నడుగక యుండుటయును
పరు లడిగిన నాస్తియనుచు బలుకనియటు నీ
చరణములను గొలిచెదు మది
చిరకృప నిడు కోండ్రపాటి సీతారామా. 37

క. చంచలమతియుతుడను మీ
రంచితమతు జేసి మనుపు మంబుజనాధా
కొంచెము గొప్పనకను యో
చించకు చినకోండ్రుపాటి సీతారామా. 38

క. దండము దశరథనందన
దండము దయజూడుమయ్య తాపసహారణా
దండము ఘోరాఘంబుల
చెండుము చినకోండ్రుపాటి సీతారామా. 39

క. చిత్రచరిత్ర పవిత్రా
పుత్రసుమిత్రాదిబంధుపోషిత కరుణా
పాత్రుడ కడ తేర్చుమయా
చిత్రాకర కోండ్రుపాటి సీతారామా. 40

క. క్షణక్షణగండము లనియెడి
కణకులుగల గుండమందు కాలెడుభంగిన్
మిణుకుచునుంటిని బ్రోవుము
చినకోండ్రుపురీనివాస సీతారామా. 41

క. గాసిలి తీవ్రణతియముల
మోసితి కడుదుఃఖవార్ధి మోదములేకన్
రోసితి దాసుడ సేవయె
జేసితి చినకోండ్రుపాటి సీతారామా. 42

క. ఏకశిలను వెలసిన నీ
ప్రకటగుణవిషయములను, ప్రణుతించుటకున్

ఆ కమలభవుని తెరమా
శ్రీకర చినకొండుపాటి సీతారామా. 43

క. శ్రీరామ నిను స్మరింతును
శ్రీరామా సన్నుబ్రోవు శ్రితజనవరదా
శ్రీరామా మ్రొక్కెద నో
శ్రీరామా కొండుపాటి సీతారామా. 44

క. పరిపరివిధముల వేడిన
కరివరదా గావవేమి కరుణావార్ధీ
దురితహరణ పరమాత్మా
స్థిరజీవిత కొండుపాటి సీతారామా. 45

క. నారాయణ యనిన నందను
కూరిమి దజామిళు నాడె కూర్మి బ్రోచవా
తీరున నను కాపాడుము
శ్రీరంగా కొండుపాటి సీతారామా. 46

క. పాంచాలివినుత రామా
సంచితముల నణపు రామ సద్గుణధామా
వంచితభవహర రామా
శించితి చినకొండుపాటి సీతారామా. 47

క. క్షీరము దధిఘృతమధురా
హారంబుల రుచిని మించు నామామృతముఁ
గోరికతో పఠియించితి
జేరుచు దరి కొండుపాటి సీతారామా. 48

క. సీతాపతి మీరేగతి
భూతలమున నన్ను బ్రోచు పూర్ణకృపాబ్ధీ
యేతెరగున కడతేరగ
జేతువొ చినకోండ్రుపాటి సీతారామా. 49

క. ప్రతియుగమున జనియించుచు
మతిమంతుల బ్రోచి ధర్మ మన్పుచు ధృతితో
క్షితిగల దుష్టుల దుంచిన
క్షితిపతి చినకోండ్రుపాటి సీతారామా. 50

క. శ్రవణమననసంకీర్తన
మవిరత పదసేవ దాస్య వందనములతోన్.
నవవిధు లర్చించు మదిన్
శివకర నిడుకోండ్రుపాటి సీతారామా. 51

క. జీవము గలంతకాలము
భూవర నీపాదయుగము పూజింతు హృదిన్
దేవర సన్నిధి జేర్చుము
శ్రీవరదా కోండ్రుపాటి సీతారామా. 52

క. చరమచరాదుల కెల్లను
మరి సుకృతము చేయబూని మంచి పరికరాల్
కరుణ నిడుజనక నన్నేల్
స్థిరచిత్తుడ కోండ్రుపాటి సీతారామా. 53

క. మతిహీనుడ గతి నెరుగక
ధృతియుతు నీదరిని జేరు దృఢమతి లేకన్

వెతలను బడితిని రామా
క్షితిధర శ్రీకొండ్రుపాటి సీతారామా. 54

క. చెదరని సుఖ మొసగూర్చెడి
సదయుండవు నిత్యుడవును సకలాధారా
ముదమిడు పదవిని నెపుడి
చ్చెదొ దెల్పుము కొండ్రుపాటి సీతారామా. 55

క. పచ్చవిలుతునికి తండ్రి
ముచ్చుల సంసారజలధి మునిగితినయ్యా
విచ్చేయుము దరి జేర్పగ
చెచ్చెర చినకొండ్రుపాటి సీతారామా. 56

క. చిచ్చును బోల్కష్టంబులు
వచ్చి శరీరంబు జొచ్చి వడి గాల్ప మిముఁ
హెచ్చుగ స్మరింప లే నన్మన
సెచ్చగ చినకొండ్రుపాటి సీతారామా. 57

క. సదయహృదయుడవు నీమృదు
పదముల హృదినుంచి బ్రోవు పద్మదళాక్షా
వదలక పూజింతును మిము
చెదరని చినకొండ్రుపాటి సీతారామా. 58

క. పంకేజాయతనేత్రా
శంకరసఖ నెంచతరమ జగదుద్ధారా
సంకటహరణా పాలిం
చింకను చినకొండ్రుపాటి సీతారామా. 59

క. కింకరకింకరుడను నీ
సంకేతంబునకు జేర్చు శరణి జూప మీ
సంకోచము విడి దయయుం
చింకను చినకోండ్రుపాటి సీతారామా. 60

క. అండజవాహన మణి స
త్కుండలమకుటాదిభూష కూర్మాకారా
భండనపండిత దైత్యుల
చెండిన చినకోండ్రుపాటి సీతారామా. 61

క. ఒడలెల్ల దడిపి యిసుకలో
బడిపొరలిన నంటునిసుక భక్తితొ వార్ధిం
దిడునుడుతను గను దయ మె
చ్చిడి బ్రోవుము కోండ్రుపాటి సీతారామా. 62

క. శల్యాయుధహల్యాదుల
నైల్యాదులనెల్ల నణచి నర్మిలితోడన్
తుల్యరహితమగు, పదసౌ
శీల్యం బిడుకోండ్రుపాటి సీతారామా. 63

క. ఎంగిలిఫలముల నిచ్చిన
మింగి శబరి నేలితయ్య మేఘశరీరా
శృంగారరూపుడవు శ్రీ
చెంగటగల కోండ్రుపాటి సీతారామా. 64

క. లక్షణకావ్యాదుల నే
వీక్షించక నున్న పద్యవిధు లన్నియు ప్ర

త్యక్షమయి యుండె తనుకృప
శిక్షిత భవకొండుప్రిపాటి సీతారామా. 65

క. అప్పా నీచరితంబుల
చెప్పదలచువారు నియతి చెదరక దెలుపన్
తప్పులు రావని దృఢమతి
చెప్పితి చినకొండుప్రిపాటి సీతారామా. 66

క. అంజలిడి యెఱగితో రఘు
కుంజర నాశ్రమల దోలు కోమలదేహా
నెంజలి పుంజంబుల గా
సిం జెరువుము కొండుప్రిపాటి సీతారామా. 67

క. కొండలబోలిన భవములు
మెండుగ నార్జించుకతన మేనిఃబు శ్రిమలం
దుండి నిను బొగడి తఘముల
చెండుము చినకొండుప్రిపాటి సీతారామా. 68

క. కనికనక సలిపి తఘముల
అనఘా మదినిల్పి నిన్ను నర్చించెడువా
రనఘాత్ములనుచు వింటిని
చినకొండోప్రిల్వాస బోధ్రప్రు సీతారామా. 69

క. మించిన నీనామస్మర
ణెంచుచు నేనున్నతరిన నే కష్టంబుల్
వంచించెను నను దయ పో
షించుము చినకొండుప్రిపాటి సీతారామా. 70

క. తలిదండ్రులు కొమరునిపై
చలముంచిన తెరవుయేది చక్రపాణినా
కలుష ముడుప మీరేగద
చిలువశయన కోండ్రపాటి సీతారామా. 71

క. కాలము వృధగా గడచెను
పాలసులను గూడి చెడితి పార్థివముఖ్యా
నేలుము కరుణామృతమున
శీలా చినకోండ్రపాటి సీతారామా. 72

క. ఆకొన సుధ దొరకినగతి
చేకొంటిని తల్లిదండ్రి స్థిరుతా మిమ్మున్
నా కేమికొరత లే దిక
శ్రీకర చినకోండ్రపాటి సీతారామా. 73

క. కోమల నీలశరీరా
హేమాంబర మేరుధీర హేశ్రీధర రా
వే మిది దర్శనమిడు మో
శ్రీమహితా కోండ్రపాటి సీతారామా. 74

క. హరి స్మరణామృతపానము
మరి గ్రోలుచు నుంటి నెపుడు మనసోత్సాహం
బురువొనను నార్యోక్తిని
స్థిరపడజే యోకోండ్రపాటి సీతారామా. 75

క. హస్తామలకన్యాయము
శస్తుడ మిము గొలుచునట్టి జను లందరికిన్

సు స్తిని జేయక సుఖమిడు
సిస్తుఢ చినకోండ్రుపాటి సీతారామా. 76

క. తరుణారుణమృదుచరణా
శరణార్థుడ శత్రుభీమ శమదమసుగుణా
భరణా కరుణించి నను
చిరకృప నేలోకొండ్రుపాటి సీతారామా. 77

క. మీనామామృతమధురసు
గానము విన జనువ వ్రాయగా గల్గుమహా
త్మానందమె యానందము
జేనొనరుతు కోండ్రుపాటి సీతారామా. 78

క. పట్టితి నీపదములు చే
పట్టితి శ్రీరామచంద్ర పావననామా
పట్టిక ఖోప్రము నను జగ
జెట్టీ చినకోండ్రుపాటి సీతారామా. 79

క. పెట్టక పోషింపక లే
నట్టిభరము బూను టేల నగధర నాతో
గట్టిగ దెల్పక జను జగ
జెట్టి చినకోండ్రుపాటి సీతారామా. 80

క. పట్టివడి మమత లేలా
చుట్టుతిరిగి మొక్క ముఖము జూప వదేలా
రట్టును జేసెద నిక నిను
చెట్టలుడుపు కోండ్రుపాటి సీతారామా. 81

క. సాయుజ్యము సారూప్యము
లీయుము సాలోక్యములను యిందిరధర నా
కీయుము నీభక్తిని దయ
చేయుము చినకోండ్రుపాటి సీతారామా. 82

[దశావతారములు.]

క. దనుజుడు నిగమములను గొని
చని వార్ధిని జొరగ వానిఁ జంపి నిగమముల్
వనజభవు కిడినతండ్రీ
చినకోండ్రుపురవాస శ్రీశ సీతారామా. 83

క. సుర లసురు లుదధి దరువగ
గిరి నిల్పినకూర్మరూప కీర్తికరుడ నీ
చరణంబుల పూజించెద
స్థిరుడవు చినకోండ్రుపాటి సీతారామా. 84

క. మదమున హిరణ్యనేత్రుడు
చెదరగ భువి జుట్ట వాని జీల్చినశూరా
సదయుడ కిటిపతి నిన్నెం
చెద కోండ్రుపురీనివాస సీతారామా. 85

క. నరహరివై దితిసుతునిఁ
బరిమార్చి భయంబు బాపి ప్రహ్లాదునకుఁ
గొరతలేనిపదవి నిడితివి
చిరకృప చినకోండ్రుపాటి సీతారామా. 86

క. బలిచే మూడడుగులు గొని
అలహరిహాయు బోంచురీతి నాలింపు మొరల్

కలుములచెలినాథా శ్రీ
చెలువొందెడు కొండ్రపాటి సీతారామా. 87

క. జమదగ్నికుమారుడవై
సమయించితి వెల్లరాజసముదయకోట్లన్
యమనియమాదు లెరుంగను
స్తిమితుడ నేలు కొండ్రపాటి సీతారామా. 88

క. పదిశిరములు గలదనుజుని
చిదిపినశ్రీరామచంద్ర శ్రితనుతచరణా
సదయాత్మ మది నమ్మితి
చెదరని చినకొండ్రపాటి సీతారామా. 89

క. తాలాంకుడవై దనుజుల
గూలిచి సుజనాళి నెల్ల కూర్మిని బ్రోచే
నీలాంబరధర బ్రోవుము
శీలా చినకొండ్రపాటి సీతారామా. 90

క. బుద్ధుడవై త్రిజగంబుల
శుద్ధమనస్కులను జేసి శుభముల నీయన్
బుద్ధు లిడగ నుదయించిన
సిద్ధిగలుగు కొండపాటి సీతారామా. 91

క. కలిక్యవతారంబున నీ
కలియుగమున బుట్టినట్టి కలుషాత్మకులన్
బలిమిని ద్రుంచితి వౌరా
చెలువా చినకొండ్రపాటి సీతారామా. 92

[ షోడశోపచారములు. ]

క. ధ్యానము నావాహనమును
మానితపీఠము సుపాద్య మమరెడునర్ఘ్యం
బే నీ కొసగితి గైకొను
శ్రీనుత చినకొండ్రుపాటి సీతారామా. 93

క. ఆచమనము హరి జేయుము
నీచరణాబ్జములసేవ నేర్పుతో జేతుఁ
భూచరఖేచరపూజిత
శ్రీ చినకొండ్రుపురివాస సీతారామా. 94

క. వసనము లుపవీతంబులు
మిసిమిం గలచందనంబు మెప్పగుపూలన్
నిసి బవ లర్చించెద మిము
సిసలా చినకొండుపాటి సీతారామా. 95

క. అభిషేకము గావింపుడు
త్రిభువనరక్షకుడ భూప దివ్యశరీరా
శుభకర హేమాంబర ల
క్ష్మీభరిత చినకొండ్రుపాటి సీతారామా. 96

క. ధూపము దీపములను గను
మోపరమేశా ముకుంద యోజగదీశా
కోపింపకు గోవిందా
శ్రీపతి చినకొండ్రుపాటి సీతారామా. 97

క. పప్పును చిత్రాన్నము దధి
అప్పడము లపూప మాజ్యపాయస మిగురుల్
యిప్పుడె సాపడు మప్పా
చెప్పితి చినకోండ్రుపాటి సీతారామా. 98

క. కప్పురపువిడెములు గొనుమా
కప్పురపుహారతుల నిస్తి కమలదళాక్షా
త్రిపురారిసఖుడ మ్రొక్కితి
శిపివిష్టుడ కోండ్రుపాటి సీతారామా. 99

క. అలరులు మంత్రయుతంబుగ
జలజోదర నీకొసంగి శాస్త్రోక్తముగా
తల వంచియు నుతిజేసితి
చిలువశయన కోండ్రుపాటి సీతారామా. 100

క. ఉయ్యాల లూచుపాటలు
నెయ్యముగను లాలిజోల లిప్పుడు పాడి
నుయ్యాల నూచితి నిదురిం
చియ్యెడ చినకోండ్రుపాటి సీతారామా. 101

క. సెల వొసగుడు గృహకృత్యా
దుల నొనరిచి దీక్షబూను దచ్యుత నీశ్యా
మలరూపాదుల హృది నిడి
చెలగెద చినకోండ్రుపాటి సీతారామా. 102

క. సీతారామాచార్యుడ
గౌతమగోత్రజుడ వేంకటాచార్యుని స

తృప్తిత్యగు తాయమసుతుడగ
క్షితిపతి బ్రోవ్వోండ్రుపాటి సీతారామా. 103

క. కందశతాష్టోత్తరముల్
అందంబుగ మాలగూర్చి యర్పించితి నో
యిందిరధర దాల్పుము సిరి
జెందిన శ్రీకోండ్రుపాటి సీతారామా. 104

క. శ్రీసీతాపతిశతకము
వ్రాసెడు విను జదువు వ్రాయువారికి శుభదం
బౌసుఖ మిడి కాపాడెడు
శ్రీసంయుత కోండ్రుపాటి సీతారామా. 105

క. శ్రీయువవత్సర మాఘం
బాయతశుభమైన ధవళపక్షదశమికి
వ్రాయుట శతకము పూర్తిని
జేయుటయె నోండ్రుపాటి సీతారామా. 106

క. రవిచంద్రులు గలకాలము
భువి సీతారామశతక మర్చిత మగుతగ
రవిచంద్రనయన రఘువర
శివకర చినకోండ్రుపాటి సీతారామా. 107

క. మంగళహారతి గొను మో
మంగళకర మదనజనక మార్తాండకులో
త్తుంగవ జేర్చుము నను నీ
చెంగట చినకోండ్రుపాటి సీతారామా. 108

శ్రీ సీతారామార్పణమస్తు.

## బలభద్రపాత్రుని వెంకటసుబ్బరాయరచిత మగుకీర్తనలు.

‘ రామా గుణధామా - రవివంశజలధిసోమా ’
అను మాదిరికీర్తనలో కొంతద్రుతముగా చదువవలెను.
ద్రుతముగలచోట రెండు అడ్డగీత లుండును.

రాగం జుల్వతాళం.

1. హనుమా దయగనుమా - హరివంశజలధిసోమా
రణభీమా గుణధామ బోధ్రువుమా ॥హను॥

2. అంజనీపుత్రా - శ్రీకపి - కుంజర ఘనగాత్రా - రంజల్లు
నీపాద - కంజములపై నొఅగి=మంజులసుమనిచయంబుల
మరియర్పింతుము భక్త-పుంజంబుల- నెంజిలులను - భం
జించినబలవంత. ॥హను॥

3. రాముముద్రికన్ - కడు-ప్రేమతో గైకొని- కోమలాంగి-
సీత కొసగి - ఆమె యొసగినయానవాలును = రాముని
కిచ్చినస్వామి - నేమరకను నీనామ - స్తోమంబుల నీమం
బున - నెంతుము మది - ధీమంతుడ ॥హను॥

4. అంబురాశినిన్ - మిగుల వి - జృంభణంబునన్ - అంబ
రంబు నంట నరిగి - యావలివైపు లంకలో జేరి = కుంభీం
ద్రముపై సింహము - కుప్పించినవిధి దూకుచుగంభీరధ్వని
జేయుచు - ఘనదనుజుల ఖండించిన ॥హను॥

5- వాలానలంబునన్ - దనజు - ప్రోలు గాల్చితో - ఫాల
నేత్రుపరమపుత్ర - పాలనజేయు - భక్తపోష = బాలా

ర్క-ద్యుతిజాలా - భవమోచననుతశీలా - కాలానలసమ
వాలా - కడుచిత్రము నీచరితము ॥హను॥

6. సుజ్ఞానరూపివీ - వరశూరజ్ఞానజైత్రివీ - అజ్ఞానులగుమమ్ము
సుజ్ఞానులను జేయు - ప్రజ్ఞాధికుడవాని - ప్రస్తుతించితి
మయ్య=సుజ్ఞానము బోధించిన అజ్ఞానము హరియింపద -
ప్రజ్ఞాధికుడ కీరితి ప్రజ్వరిలంగను జేయును ॥హను॥

7. నవవిధంబులతో - వ్యాకర - ణాదిశాస్త్రముల్ - పవలు
వేలుపునొద్ద జదివిన - పవమానతనయా - భక్తపాదా
శ్రితాఅవనిజపతి యగురాముని - యర్చించెదుభక్తుడవని -
తవధ్యానము జేసెదుమము తరియింపగజేయుమయ్య ॥హ॥

8. కొండుప్రాట్పురికి - నివసించు - చుండుదైవమా - ఖండ
తేజ - భండనో - ద్దండపండితుండ మొరవిను - చుం
డియు గావవ కో - దండపాణిభక్తుడ నీ - యండజేరి -
యుండగోరు - చుండెడునీ - భక్తులము ॥హను॥

9. కరుణజూడుమా - కేలోడ్తు - కపికులోత్తమా - శరణు
శరణు జగదేకశూరా - పరమపురుష పరితాపముల=దరి
జేరగ రానీకని - గురిగా నిను వేడుకొనిన - మరి వేంకట
సుబరాయుని - కరుణించిన - కపిశేఖర ॥హను॥

---

'అడుగుదాటి కదలనివనూ - నా కభయమివ్వక నిన్ను విడను' అనుమాదిరి

కాంభోజిరాగము, అటతాళము.

1. పట్టాభిరామ శ్రీరామా - ననుచే - పట్టి బ్రోవర రఘురామా
పట్టని బ్రోవుమా ని - గట్టిగ వేడిన చే - పట్టి బ్రోవాకుం

టివి - చెట్టిసంగతో దెల్పు = గుట్టుగా ని న్నడిగినను చెవి -
బెట్టకుంటి విదేమిచిత్రమొ - రట్టు జేతును పదుగురిలో
నడికట్టుబట్టుక నిల్పుదునుసుమి ॥పట్టా॥

2. సచ్చిదానందమయమూర్తి - అభయ - మిచ్చి కదలుము
రామమూర్తి - స్వచ్ఛమౌ యాసీత - లక్ష్మణాదులతోడ -
వచ్చి దర్శనమిచ్చి - దరిజేర్పుమని గోర్తి = తుచ్ఛసుఖ
ముల - నొల్లనిక హరి - సచ్చరిత నీనామమధురస -
మిచ్చదీరగ గ్రోలుబుద్ధిని - హెచ్చుగా నిమ్మంటి రామ
॥పట్టా॥

3. కఠినమాడితినంచు నన్నూ - బహుకఠినశిక్షలో నుంతు
ననుచూ - దిటవరినంచు నీమది నెంచుచున్నను - కుటిల
కుంతలయౌ మా - యమ్మ సీతమ్మతో = పటుతరంబుగ
మనవిజేతును - నిటుల నిటులని మాయనడతలు - చటుల
మతితో దెల్పి నిను నే - కఠినశిక్ష నొనర్చ జేతును ॥పట్టా॥

4. సామదానభేదదండో - పాయా - సద్విధముల నీకు
దెలుపా - యేమి యెరుంగానివానిరీతిగ నుండి - తామసు
డని నన్ను - దండించుచుంటివి = కోమలాంగ సుధీర
రామా - వేమ రిటు నను కష్టములలో - ప్రేమవీ డిటు
జేయభావ్యమ - రామరామ హారేహారే శ్రీ ॥పట్టా॥

5. గడియైన నీనామ మిడకా - భక్తి - నిడి శ్రీరామరామ
యనుచూ - వడివడిగ కాలంబు - జనునని తడబడక -
కడుధైర్యమున హృది - చెడనిపదవని నమ్మి = అడుగడుగు

నకు లయ - విడక నడుగిడి - పదమివతి - శ్రీరామ
హరియని - విడువకను నిను - నుడువుచుంటిని - బెడద
లుడుపవలదేల రామ ॥పట్టా॥

6. తప్పు లున్నవటంచు నెంచీ - రామ - ముప్పుదోలవ మది
యోచించీ - తప్పులున్నవరు తండోపతండములు -
ఒప్పుగ నీనామ మెప్పుడూ దలచీన=తప్పులెల్లను దగ్ధ
మౌనని - యొప్పుశాస్త్రంబులలో జెప్పిన - దోషమనని
బుధులెల్ల జెప్పిరి - తప్పదిక రామప్ప బోసివర ॥పట్టా॥

7. భక్తసంరక్షకుడవానీ - భక్తపుంగవులు - దెల్పంగ వినీ -
భక్తిముక్తులొసంగి - భవభయంబులు బాపి - భుక్తి
యొసగినరామ - భూపాలతిలక హరి=భక్తిహీనుడ శక్తిహీ
నుడ - యుక్తిహీనుడ - భక్తి నీపయి - వ్యక్తి నిలుపగ
జాలగా - సశక్తుడను - రిక్తుడను రామా ॥పట్టా॥

8. శ్రీకొండుపురవాసరామా - కృష్ణ - రాకేందుముఖజిత
కామా - శ్రీకమలాసనా - సేవితపదారవింద - లోకో
త్తరా రామా - రామరామాహరే=లోకపాలన శ్రీకరా
సుగుణాకరా కరుణాకరా - నైకసాష్టాంగములు రామా -
నీకు నిరతము జేతు రామా ॥పట్టా॥

9. శరణాగతత్రాణబిరుదూ - యెచట - మరుగూన దాచితి
రామా - కరి యహల్యశబరి - గరితాదిభక్తుల - మరి
గాచి తనుమాట - నెరిజూపుతరి యేది=విరివిగను బలభద్ర
పాత్రుని - వేంకటాసుబ్బరాయుడిక నీ - తగుణమున

రక్షింపకున్ననీ - చరితమంతయు చాటు జగమున
॥దృష్టాభిరామ శ్రీరామా॥

---

'భజనాసేయుదాము రండి' అనుమాదిరి.

మోహనరాగము - ఆదితాళము.

1. శ్రీరామనామమాధుర్యం - శ్రీరామసేవ మహదైశ్వర్య ధుర్యం ॥శ్రీరా॥

శ్రీరామమాధుర్యం - దివ్యామృతతుల్యం = శ్రీరామస్మరణామృతంబు - గ్రోలు - వారికి గల్గు నైర్మల్యం - కడ - తేరుమార్గము జూపుధైర్యం - బొసగు - మేరమీరిన నామామృతవర్యం - కారుణ్యమున కాలవాలం గాంభీర్యం ॥శ్రీరా॥

2. అండాపిండాండబ్రహ్మాండోదరుండయిన - పుండరీకాక్షు హృత్పుండ - రీకమందుండి వెల్గుచునుండ - యాఖండ రూపుడై మనకండా - పీడకుండా ప్రార్థించుచునుండా శ్రీశ్రో - దండపాణియె బోర్చుచుండ - దండధారుని భయము - నుండదని నమ్మండి ॥శ్రీరా॥

3. హనుమంతవరదుండు - నాశ్రితకాముండు - గుణయుతుడు గుణరాహితుండు - వినతానందనవాహనుండు - ఘనుడు కృపాంతరంగుండూ - వనజాతాయతనేత్రుండూ - యినకులోద్ధారుండు - యిందిరేశుండైన ॥శ్రీరా॥

4. దండికామాద్యుత్తమై - యుండునీవ్యాధీనిః ఖండించుదివ్యౌ
షధంబు - శ్రీకో - దండరామునిస్మరణంబు - జేయు
చుండిన - చెడనీసుఖంబు - గల్గు - రండు - భక్తాలు
ముదంబూ - తోడఖండాజ్యోతిరూపు భజనంబె నుదినంబు
॥శ్రీరా॥

5. వెరపూలెల్లా దీర్చు - వెంకాటసుబ్బరాయు - వరదూడు
శ్రీకోండుప్రాటి - పుర - ధామూడా - శ్రీరాముపాట -
రామరత్నాలు జేర్చినమూట - మంచి - అరుదైన - మోతు
పురిబాట - జ్ఞాన - సరసులెల్లా - జేరుచోట - నోట
బాడీన రుచిబుట్టు తేట యగుపాట శ్రీరామ॥



చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

